ఆవశ్యకవృత్తి టిప్పణం, నేమిచరితం, భవభావనావృత్తి, శిష్యహితా-మున్నగు గ్రంథాలు అనేకం వ్రాశాడు.

7. **హేమచంద్రాచార్యుడు :-** ఈయన కలికాలసర్వజ్ఞుడనీ కవికులపతి అనీ కీర్తిగాంచాడు. ఈయన గ్రంథాలు శతాధికంగా వున్నవి అంటారు. ఈయన సంస్కృతప్రాకృతాలలో సమంగా లేఖిని నడిపి, అనేక గ్రంథాలు స్వయంగా రచించి, అనేకకృతులకు వ్యాఖ్యాతయై శిష్యకోటికి అనంత రీతిని గురువై యుగపురుషుడుగా తేజరిల్లినవాడు మహాప్రామాణికుడు. జైనమతానికిన్నీ సంస్కృతప్రాకృతాలకున్నూ ఈ మహాపురుషుని ప్రాదుర్భావం ఒక మహాజీవాతువు. ఈ క్రిందివి ఈయనగారి గ్రంథాలలో కొన్ని. పేరునుబట్టే వాటిగౌరవం వెల్లడి అవుతుంది. కుమారపాలమహారాజుగారికి గురువు. విక్రమశకం 1145 మొదలు 1230 వఱకు వెలిగినవిజ్ఞానమూర్తి.

| | |
|---|---|
| 1. ప్రమాణమీమాంస | 12. ధాతుపారాయణం |
| 2. మహార్ణవన్యాసం | 13. అభిధానచింతామణి |
| 3. అయోగవ్యవచ్ఛేదద్వాత్రింశికా | 14. అనేకార్థసంగ్రహః |
| 4. అన్యయోగవ్యవచ్ఛేదద్వాత్రింశికా | 15. హైమనిఘంటు |
| 5. అర్హన్నీతి | 16. దేశీనామమాల |
| 6. త్రిషష్టిశలాకాపురుషచరిత్ర | 17. పరిశిష్టపర్వం |
| 7. యోగశాస్త్రం | 18. ద్వ్యాశ్రయకావ్యం |
| 8. కావ్యానుశాసనం | 19. సప్తసంధానకావ్యం |
| 9. ఛందోనుశాసనం | 20. వీతరాగస్తుతి |
| 10. లింగానుశాసనం | 21. భువనకోశః |
| 11. వాదానుశాసనం | 22. శిష్యానుశాసనం-ఇత్యాది |

N.B. ఇందులో 8 మొదలు 19 వఱకూగల గ్రంథాలు నేటి ఆంధ్రపండితులూ విమర్శకసుధీవరులు పఠించి విమర్శించి వెలయింపతగినవి. ఇవి అన్నీ అచ్చైలభించేవే కాని మఱోటికాదు.

8. వీరుగాక- అభయతిలకోపాధ్యాయుడు, అమరచంద్రుడు, అజ్ఞాసుందరకవి,

ఋషభదాసు క్షమాకల్యాణుడు క్షేమకీర్తి గుణచంద్ర గుణపాల గుణ వినయులు, గోవిందగణి చక్రేశ్వరుడు చంద్రతిలకోపాధ్యాయుడు జంబూ నాగ- జంబూకీర్తి- జయతిలక- జయవిజయ- జయసాగర జయసింహులు, జినచంద్ర జినపతి జినపాల జినభద్ర జినరత్న జినవల్లభ జినేశ్వర- దేవగుప్త దేవచంద్ర దేవప్రభ దేవసాగర దేవేంద్రసూరి ధనదేవ ధనపాల ధనేశ్వర నన్నసూరులున్నూ నమిసాధు నయరంగ నరచంద్ర నేమిసూరి పద్మప్రభ పరమానంద పుణ్యసాగర పూర్ణభద్ర పృథ్వీచంద్రులున్నూ ప్రద్యుమ్న ప్రబోధమూర్తి బుద్ధిసాగర బ్రహ్మదేవ మహేంద్ర మహేశ్వర మాణిక్యచంద్ర మాణిక్యసూర్యాదికవులున్నూ సంస్కృతప్రాకృతాలలో గ్రంథాలు వ్రాసినవారు పరశ్శతాలున్నారు. వీరినిగురించి వ్రాయడం ఆరంభిస్తే ఒక మహాగ్రంథమే అవుతుంది.

ii. బౌద్ధమతమువారిలో - గ్రంథవ్యాఖ్యాతలూ గ్రంథకర్తలూ కవులూ పండితులూ మున్నగువారు:

1. శాంతిరక్షితుడు దిజ్నాగుడు ధర్మకీర్తి ధర్మోత్తరుడు అనంతవజ్రుడు- మొదలయిన మహాప్రామాణికులున్నూ, ధమ్మపదం- అర్థశాలినీ రచించిన బుద్ధఘోషుడూ ఆచార్యవసుబంధుడూ మహాపండిత రాహులసాంకృత్యాయనుడూ బోధిసత్త్వమైత్రేయుడూ క్షేమేంద్రుడు (అవదానకల్పలత గ్రంథకర్త) ప్రజ్ఞాపారమితసూత్రకర్తా ఆర్యదేవుడు మహాయానాదిసూత్రాలు రచించినవారూ జాతకమాలరచించిన ఆర్యశూరుడూ తథాగతగుహ్యక సమాజగ్రంథకర్త దాఢావంశగ్రంథకర్త దివ్యాదాన దీపవంశగ్రంథకర్తలూ అశ్వఘోషుడూ ఈ మొదలయిన మహాపండితులూ కవులూ గ్రంథకర్తలూ వ్యాఖ్యాతలూ తార్కికులూ శాబ్దికులూ కథాఖ్యాయికాగ్రంథకర్తలూ మొదలయినవారు అనంతంగా అనంతగ్రంథాలకు కర్తలైవున్నారు.

## ఉత్తమమైన ప్రాకృతసాహిత్యమునుండి కొన్ని వాఙ్మయ రత్నాలు మచ్చుకై చూడండి

జైనులూ బౌద్ధులూ ప్రాకృతంలో ప్రాకృతులయాత్మల కున్నతిని కలిగించుటకై శాస్త్రాలూ వ్యాఖ్యానాలూ తత్త్వగ్రంథాలూ ఉపదేశగ్రంథాలూ కథలూ

కావ్యాలూ నాటకాలూ అనంతంగా రచించారు. ఈ వ్యాసం పేరునుబట్టి వాటిని పూర్తిగా వివరించవలసినబాధ్యత కలిగివున్నా స్థలసంకోచంచేత ఆ పనిని చేయలేక పోయినందుకు పాఠకులు మన్నించవలె. అయినా ఆ వాఙ్మయంపైని వుండే ప్రేమవల్లా రసతృష్ణచేతా సరసములయిన కొన్నికొన్ని భాగాలు ఆయాగ్రంథాల నుండి వుదాహరించి, దీనితో సంతృప్తులు కాండి - అని చదువరులను అంజలి పూర్వకంగా వేడుకొంటూ వున్నాను, చిత్తగించండి.

1. **అంజనాసుందరీచరితం** - దీనిని రచించింది గుణసమృద్ధిమహత్తర అనే జైనసన్యాసిని. ఈమె 14వ శతాబ్దివాడైన జినచంద్రసూరికి శిష్యురాలు.

శ్లో. సిరిజేసలమేరుపురే విక్కమచపురహసతుత్తరే వరిసే,
వీరజిణజమ్మదివసే కియ మంజణిసుందరీచరియం.

ఇతి శ్రీ అంజణాసుందరీ మహాసతీకథానకం కృతి రియం శ్రీజినచంద్ర సూరిశిష్యణీ శ్రీగుణసమృద్ధిమహత్తరాయాః- అని ఈమే స్పష్టంగా గ్రంథాంతంలో చెప్పుకొన్నది. చక్కని ప్రాకృతరచన అంటారు. నేను కంటితో చూడలేదు[1]. ప్రాకృతంతో రచించినగ్రంథమే. దాదాపు వేయిశ్లోకాల గ్రంథం అంటున్నారు.

2. **అతిముక్తచరిత్రం** - పూర్ణభద్రగణి వ్రాశాడు. ఈయన జినపతిసూరి శిష్యుడు. దశశ్రావకచరిత్ర ధన్యశాలి భద్రచరిత్ర- మొదలయినగ్రంథాలు కథలు సంస్కృత ప్రాకృతాలలో సమంగానే వ్రాశాడు. విక్రమశకం 13లో ఉన్నాడంటారు.

3. **అలంకారదప్పణం** - ఈ గ్రంథకర్త పేరేమో తెలీదు. ప్రాకృతభాషలోనే ఈయన అలంకారశాస్త్రం రచించాడు ప్రాకృతకవులకూ ప్రాకృత పాఠకులకూనూ. మచ్చుకు ఒకటి రెండు శ్లోకాలు ఇస్తున్నాను. శాస్త్రమార్గంలో కూడా ధారాళత చూపుతుంది ఈయనశైలి:-

---

1. ఇక్కడ దిక్ప్రదర్శనంగా వివరించేగ్రంథాలన్నీ – శ్రీలాల్చంద్ భగవాన్ దాసుగారి గ్రంథ వివరణపట్టికనుండియే యిస్తున్నాను. కొన్ని నా సొంతాలు కూడా వున్నవి. వానిని అక్కడే ప్రస్తావిస్తాను.

శ్లో. సుందరపయవిణ్ణాసం విమలాలంకారశోహియ శరీరం,
సుయదేవియం చ కవ్వం పణవియం పవరవణ్ణడ్డం.
సవ్వాయిం కవ్వాయిం, సవ్వాయిం జేణ హోంతి భవ్వాయిం,
తమలంకారం భణిమో లంకారం కుకవికవ్వాణం.
అచ్చంతసుందరం పి హు నిరలంకారం జణమ్మి కీరంతం,
కామిణిముహం వ కవ్వం హోయి పసణ్ణం పి విచ్ఛాయం.
తా జాణిఊణ నిపుణం లక్ఖిజ్జహ బహువిహ మలంకారం,
జేహం అలంకరియాహం బహుమణ్ణిజ్జంతి కవ్వాయిం.

4. **ఆదినాథచరియం**-దీనిని వర్ధమానుడనే జైనాచార్యుడు వ్రాశాడు. 11 వేల శ్లోకాలుగల్గి ఐదు అవసరాలుగా విరచింపబడ్డ ప్రాకృతకావ్యం ఇది. ఇంత విపులమైన జినచరితం ప్రాకృతభాషలోనేకాదు ఏభాషలోనూ వ్రాయబడ లేదని వివరణపట్టిక వ్రాసినవారు ఆశ్చర్యపడ్డారు. మధ్య మధ్య-అపభ్రంశ భాష మొదలయినభాషలు వివిధరీతులవాడాడు ఈయన. ఇతని శైలికి మచ్చు ఈ క్రింద రెండుపద్యాలు చాలి వుంటవి. విక్రమశకం 11వ శతాబ్దివాడు ఇతడు.

శ్లో. విక్కమనివకాలాఉ సయేసు ఏక్కారసేసు సత్తేసు,
సిరిజయసింహనరిందే రజ్జం పరిపాలయంతమ్మి.
ఖంభాయిత్థత్తియేహిం సియపక్ఖే చిత్తవిజయదసమీయే,
పుస్సేణం సురగురుణో సమత్థియం చరియ మేయంతి-ఇత్యాది.

5. **కయిసిత్థం**-ప్రాకృతభాషలో వ్రాసిన గొప్పఛందశ్శాస్త్రగ్రంథం ఇది. ఆరు నియమాలుగా-గ్రంథభాగాలుగా ఇది విభక్తమై వుంది. మాత్రావృత్త వర్ణ వృత్తాదులను చక్కని ఉదాహరణాలతో ప్రదర్శిస్తుంది. రచించినకవిపేరు లేదు. కాని కయిసిత్థం కవిసిట్టం కృతసిద్ధం ఛందోవిచితి-మొదలయినపేర్లు దీనికి గ్రంథకర్తే వ్యవహరిస్తూవున్నాడు. దండికవి కావ్యాదర్శంలో తానొక ఛందోవిచితి వ్రాసినట్లు చెప్పుకొన్నాడు. ఈకవి-సద్భావలాంఛనుడు గంధహస్తి అవలేహచిహ్నుడు అనే కవులనూ పింగళమహర్షినీ స్మరించి నమస్కరిస్తాడు. దీనికి భట్టగోపాలుడు అనే అతడు వృత్తి వ్రాశాడు.

ఈ వ్యాఖ్యాత కాత్యాయనుడిని భరతుడిని కంబళాశ్వతరాదులను ఉల్లేఖిస్తాడు. దలాలు మొదలయినవారు ఇది విరహాంకుడిదని ఉల్లేఖించారు. మచ్చుకు-ఆరంభంలో.

శ్లో. దేయిం సరస్సయిం పణమిఊణ గరుయాకయి గంథహత్థిం య,
సబ్బావలంఛణం పింగళంచ అవలేవయిణ్ణాం య.
కామిణికవోలపమ్హ పరితణయ బుద్ధివిహావోది దయియామే
సాహయి సముచ్చయం విరహలంఛణో విత్తజాయీణ.
తం జియలోయే దువిహం మత్తావిత్తంచ వణ్ణవిత్తంచ,
తస్సమయే తుహ లఖణేణ లఖణం సీసయి నయంగీ,

7. **కాలకాచార్యకథ**-ఇది చతుర్థపర్యూషణాపర్వ చరిత్రకారుడి కథ. పంచమీ ప్రబంధం పర్యూషణాకల్పం మొదలయివాట్లల్లోనూ కూడా ఈ కథే వస్తుంది. కర్త ఎవ్వరో? గ్రంథం చిన్నది.

8. **కువలయమాల** - దీనిని దాక్షిణ్యచిహ్నుడనే మారుపేరుగల ఉద్యోతనాచార్యుడు రచించాడు. ప్రసంగసందర్భంగా ఇదివఱకే కొంత వుదాహరింపబడ్డది. చాలా చమత్కారమైనగ్రంథం. వీధినాటకం-ప్రహసనం-ప్రబంధం-చంపూ మొదలయినవాటి లక్షణాలు కనిపింపజేస్తూ హాస్యంగా సరసంగా వర్ణిస్తాడు. హాస్యం సంభాషణశైలిగా గల భాగాలనుండీ కొంచెం ఉదాహరిస్తాను. కవి స్వయంగానే దీనిని తాను మహారాష్ట్రం ప్రాకృతం మొదలయిన నానాప్రాకృతాలలోనూ మధ్యమధ్య - సంస్కృతంలోనూ కూడా రచిస్తున్నాననీ తాను చంద్రకులంవాడననీ విక్రమశకం ఏడవశతాబ్ది చివరవాడననీ చెప్పుకొంటాడు. ఉదా:-

రేరే ఆరోట్టః భణ రే జావ ణ పమ్హుసయి, జనార్దన పుచ్ఛయి కత్థ తుజ్ఝే కల్ల జిమిల్లియా ? (తేణ భణివు) సాహిఉం జే తేతఉత్తస్య వలఖియి కోల్లయహ తణయే జిమిఅల్లయా. (తేణ భణివు) కిం సా విసేమహిళా వళఖిఇయేల్లివ? (తేణ భణివు) సా యబడారియ సంపూణ్ణా సలక్షణ గాయత్తి

యద్ధుసియ. (అణ్ణేణ భణియం) వణ్ణి! కీదిశం తత్థ భోయణం వాసుయీ? (పుణ అణ్ణేణ) ఛాయీ భట్టో! మయె భోయణం పుట్ఠం తక్ఖోహం న వాసుయీ! (అణ్ణేణ ఉణ) కత్తు ఘడయి తఉ హద్ధయ ఉల్లావ. భోయణం పుట్ఠం సో నామ సింఘసి? (అణ్ణేణ) అరేరే వడ్డో! మహాముఖ్ఖ జే పాడలిపుత్త మహానయరవత్థవ్వే తే కుత్థా సమ్మసుత్తి వుజ్ఝాణం? (అణ్ణేణ) అమ్హాని ఇఅం ముఖ్ఖత్తి. (అణ్ణో) కాఇుం కజ్జ? (తేణ భణివు) అనిఉణ నివుణతత్థుత్తిప్పఉర? (తేణ ఉణ) భట్టో సచ్చం త్వం విదత్థో కింవుణ భోయణే సుత్థుపుత్థం. మామ కహియం? (తేణ భణిఉ) అరే మహాముఖ్ఖ వాసుయీ వయనసాస్సం కజ్జేయి. శ్రుత్వా కుమారేణ చింతితం - అహో అసంబద్ధఖ్ఖరాలాపత్తణం బాలదేసిఆణం అహవా కో అణ్ణో వావారో ఇమాణం పరపిండపుట్ఠందేహాణం - విజ్ఞా విణ్ణాణ ణాణావిణయ విరహియాణం చట్టరసాయణం మోత్తుణ"—ఇతి.[1]

దీని అర్థంఇదీ:-"ఓకే ఓకే ఆరట్టా . చెప్పరా మరచిపోకముందే. జనార్దనా!

---

1. ఛాయ:- రేరే ఆరోట్ట! భణ రే! యావన్న విస్మరతి. జనార్దన పృచ్ఛామి కుత్ర యూయం కల్యే జిమితవంత:? (భోజనం కృతవంత:!) (తేన భణితం-) సాధితం, య:స్స జేతపుత్రస్య బలక్షయి గృహస్యతనయా, తత్ర భుక్తం. తేన భణితం) కిం సా వైశ్యమహికా బలక్షయికస్య గృహే? (తేన భణితం) సాచ భట్టారికా సంపూర్ణసలక్షణా, గాయత్రీ యాదృశీ తాదృశీ. (అన్యేన భణితం) వర్ణిన్, కీదృశం తత్ర భోజనం? వాసుకీ? (పునరన్యేన) త్యాగిన్ భట్ట; మయా భోజనం స్పృష్టం. తక్షకో౽హం న వాసుకి: (అన్యేన) కుతో ఘటతే ఏవహాధిక్ ఉల్లాప:? భోజనే స్పృష్టే స్వనామ కథయసి? (అన్యేన) అరేరే వడ్డా! మహామూర్ఖ! యే పాటలిపుత్ర మహానగరవాస్తవ్యా: తే కుతో సమాసోక్తిం విజానంతి? (అన్యేన) అస్మాదపి ఇయం మూర్ఖతరీ? (అన్యో) కస్మాత్కారణాత్? (తేన భణితం) అనిపుణ! నిపుణార్థోక్తిప్రచురా. (తేన) భట్ట! సత్యం త్వం విదగ్ధ: కింపున: భోజనం సుష్ఠు పృష్టం! మామ! కథితం? (తేన భణితం) అరే మహా మూర్ఖ! వాసుకీవదనసహస్రం కథయతి. శ్రుత్వా కుమారేణ చింతితం-అహో! అసంబద్ధాక్షరాలాపిత్వం బాలదేశ్యానాం. అథవా క: పున రన్యోవ్యాపార ఏషాం పరపిండపుష్టదేహానాం విద్యావిజ్ఞాన జ్ఞానవినయ విరహితానాం చట్టరసాయనం ముక్త్వా-ఇతి.

అడుగుతున్నాను-ఎక్కడ నీవు పొద్దుటే భోంచేశావు? (వాడు) చెప్తాను. వాడు ఉండలేదూ జేతపుత్రుడూ - బలక్షయీ - వాడికూతురు! అక్కడ భోంచేశాను. [వాడు-అంటే రెండోవాడు] ఏమీ? ఆ కోమటిఆవిడా? బలక్షయి యింట్లో వుంటుందీ? (వాడు) ఆమె కూడా మహాఇల్లాలు. సంపూర్ణలక్షణ గాయత్రి యేల్లాంటిదో, అల్లాంటిదీ? (ఇంకోడు) అక్కడ భోజనం ఎల్లావుంది? (వా) సుకవేనా? (మఱల ఇంకోడు) త్యాగిభట్టా నేను భోయనమే స్పృశించాను. తక్షకుణ్ణి నేను. వాసుకిని గాను. (వాసుభే-అని సంస్కృతం సుఖంగానే వుందా అని ప్రశ్న. ఆ ప్రశ్న విరవ కుండా ప్రాకృతంలో ఒకేమాటగాఉచ్చరిస్తే వాసుకి-అని వినిపిస్తుంది.) (ఇంకోడు) ఎక్కడనుంచి వస్తుందోయీ నీకు సంభాషణచాతుర్యం? భోజనం అడిగితే పేరు చెప్పుకొంటున్నావూ?. [వాడు] ఓరీ! బద్ధా మహామూర్ఖుడా! పాటలిపుత్రనగరంలో వుండేవారికి సమాసోక్తి [తెలిసికొనే] నేర్పు ఎక్కడిది రా? [ఇంకోడు-కోపంతో మొదటివాణ్ణిచూపిస్తూ] మాకంటే ఈ అమ్మ ఇంకా మూర్ఖురాలు. [ఇంకోడు] ఎందు చేతా! [వాడు] అనిపుణులమాటల్లో నిపుణార్థపు మాటసొంపు చూపుతానంటుంది కాబట్టి. [మఱల వాడు] భట్టా! నీవు నిజంగానే నేర్పరివే లే! ఎందుకుఅంటే భోయనం బాగుందా? అనిఅడిగింది-మఱి-మామా! జవాబు చెప్పావా? [వాడు] ఓరీ మహా మూర్ఖుడా చెప్పలేదూ? వాసుకివెయ్యినోళ్లా చెప్పాలెననీ?-ఈ మాటలు విని రాజ కుమారుడు అనుకున్నాడు-ఓహోహో! మహామూర్ఖాగ్రేసరుల అసంబద్ధసంభాషణం!! అథవా, వీరికీ ఎత్తుడుకూళ్ళతో పొట్టపెంచేవారికీ-విద్యావిజ్ఞానం జ్ఞానం వినయం - లేనివారికి ఇంతకంటే పనేముందీ? చట్టరసాయనం [బాతాఖానీ] వదలిపెడితే-అని బావం.

మఱోఘట్టంలోంచి మఱికొంచెం చూపుతున్నాను దదువరుల ఉల్లాసంకోసం-

"భోభో భట్టఉత్తా! తుమ్హేణ యాణహ యో రాయకులే వుత్తంతః (తేణ భణియం) భణ హే వ్యాఘ్రస్వామీ! కా వార్తా రాజకులే? (తేణ) కువలయమాలాయే పురిసద్దేసిణీయే పాతయో లంబిదో, (ఇమం చ సోఊణ ఆఫ్ఫోడియ ఏక్కో ఉత్థియ చట్టో, భణియం చ ణేణం)-యది పాండిత్తేనా

1. భోభో భట్టపుత్రాః యూయం న జానీథ యో రాజకులే వృత్తాంతః? (త్రైర్భణితం) హే వ్యాఘ్రస్వామిన్ కా వార్తా రాజకులే? (తేన) కువలయమాలయా పురుషద్వేషిణ్యా పాదో లంబితః (ఇదం చ శ్రుత్వా ఆస్ఫోట్య ఏక ఉత్థితశ్చట్టః. భణితం చ తేన) యది పాండిత్యేన తతో

తదో పరిణేతవ్వా మయిం కువలయమాల. (అణ్ణేణభణియం) అరే కవణు తఉ పండిత్తు? (తేణ) షడంగు పఢమి త్రిగుణమంత్త పఢమి, కింణ పండిత్తు? (అణ్ణేణ) అరే ణ మంతేహిం త్రిగుణేహిం పరిణిజ్జయి, జో సహియే పాయే భిందయి సో తం పరిణేడి. (అణ్ణో) అహం సహితఉజ్జో గాథీ పఢమి. (తేణ) కయిసీ రే వాఘ్ఘస్సామి గాథో? (తేణ) ఇవి రే గాథో-సా తే భవతు సుప్రీతా అబుధస్య కుతో బలం?, యస్య యస్య యదా భూమి స్సర్వత్ర మధుసూదనః, (అణ్ణో) అరే రే ముఖ్ఖ కంధయోవి గాధాణం భణిసి? అమ్హ గాధం ణ పుచ్ఛహ (తేణ) తుం పఢ భట్టో యజుస్సామి! గాథో, (యజు) సుత్థు పఢమి-ఆయే కప్పే మత్తా గయా గోదారి ణ ముంచయి, కోతహు దేసహు అవయడి కో వ పరాణధి వాత్త, (అణ్ణో) పఠహో (తేణ) అరే! సిలోగో అమ్హే ణ పుచ్ఛయ గాథో (అణ్ణో) సుత్థు పఢమి-తంబోలరయియరావు అహకో కామిణిం దిత్థా, అమ్హంచియ క్షుభయి మణో దారిద్దగురూ ణివారేయి. (సర్వే) అహో! భట్టయజుస్సామి విడ్డో పండిత్తు. విద్దావంతు. గాఢో పఢయి. ఇమిణం సా పరిణిజ్జా (అణ్ణో) అరే కేరిసో సో పాతఉ. సో సే విస్మృతు, సవ్వ లోకు పఢతి త్తి-ఇమంచ సోఊణ చింతయం రాయ ఉత్తేజ - అహో అణాహవట్టియాణం అసంబద్ధప్రలావత్తణం చట్టాణం చట్టరసాయణం త్తి.

---

మయా పరిణేతవ్యా కువలయమాలా? (అన్యః) అరే కీదృక్తవ పాండిత్యం? (సః) షడంగం పఠామి త్రిగుణం మంత్రం పఠామి, కిం న పాండిత్యం? (అన్యః) అరే న మంత్రైస్త్రిగుణైః పరిణీయతే, యః పాదాన్ భినత్తి స తాం పరిణయతి. (అన్యః) అహం సహృదయో గాథాం పఠామి. (త్రైర్భణితం) కీదృశీ రే వ్యాఘ్రస్వామిన్ గాథా? (తేన) ఇయం గాథా - సా తే భవతు మధుసూదనః. (అన్యస్సకోపం) అరే మూర్ఖ స్కంధక మపి గాథాం భణసి? అస్మాన్ గాథాం న పృచ్ఛథ? (త్రైః) త్వం పఠ భట్ట యజుస్వామిన్ గాథాం? (తేన) సుష్ఠు పఠామి-ఆదౌ కల్పే మృతిం గతా గౌదావరీం న ముంచతి, కస్తస్మాద్దేశా దాపతతి కో వా పర్యాణయతి వార్తాం. (అన్యః) అరే! శ్లోకః! అస్మాన్న పృచ్ఛథ గాథాం పఠామి. (అన్యః) పఠ (సః) సుష్ఠు పఠామి-తాంబూలరచితరాగమధరం కామిన్యా దృష్ట్వా, అస్మాక మపి క్షుభ్యతి మనో దారిద్ర్యగురు ర్నివారయతి. (సర్వే) అహో భట్టయజుస్వామీ విదగ్ధపండితః విద్వాన్ గాథాః పఠతి. ఏతేన సా పరిణేతవ్యా. (అన్యః) అరే కేరిసో సో పాఠఉ జే తీయం లంబిఉ? (తేన) రాజాంగణే మయా పఠిత ఆసీత్ సతు విస్మృతః, సర్వోలోకః పఠతీతి. ఇమం శ్రుత్వా చింతితం రాజపుత్రేణ-అహో అనాథవృత్తికానా మసంబద్ధ ప్రలాపిత్వం!

దీనిఅర్థం ఇదీ :- ఓయ్ ఓయ్ భట్టపుత్రుల్లారా ! మీరు వినలేదా ఏమిటోయి రాజకులంలో కబురు ? (వారు) చెప్పోయి వ్యాఘ్రస్వామీ ! ఏం విశేషం రాజ కులంలో ? (వాడు) కువలయమాల మగవాడంటే ద్వేషిస్తూ పాదం పట్టుకొని వుందిట. (ఈమాట విని ఒకడు చప్పట్లు చరుస్తూ లేచాడు భట్టువాడు] పాండిత్యం పనికివొస్తే నేనే పెళ్ళాడాలి కువలయమాలను. (ఇంకోడు) ఎల్లాంటి పాండిత్యం వుంది నీకు ? (వాడు) షడంగం (వేదం) చదివాను. త్రిగుణంగా (సంధివిగ్రహాది రూపంగా) వుండే మంత్రం చదివాను. ఇది పాండిత్యం కాదా ? (ఇంకోడు) అరే మంత్రాలతో త్రిగుణాలతో పెళ్ళాడదురా ! ఎవడు ఆ పాదం విడదీస్తాడో వాణ్ణే పెళ్ళాడుతుంది.(ఇంకోడు)నేను సరసుడనే రా! గాథలు బాగా చదవగలను.(వారు) ఏదిరా వ్యాఘ్రస్వామీ ! గాథ?(వాడు) ఇదిగో ఇదిరా గాథ-సా తే భవతు (చదువు తాడు.) దాన్నివిని ఇంకోడు కోపంతో - అరేరే మూర్ఖుడా ! స్కంధకాన్ని కూడా గాథ- అంటున్నావురా ? నన్నడగ్గూడదూ ? గాథ ? (వాడు) నీవు చదవరా భట్ట యజుస్వామీ ! గాథా ? (వాడు) ఓ. బాగా చదువుతానూ- "తొల్లింటికల్పంలో చచ్చినవాళ్లు గోదావరిని వదలడం లేదు. అక్కడనుంచి తిరిగీ వచ్చేవాడెవడూ ? వార్త చెప్పేవాడెవడూ?(అని అర్థం) మరోడు-అరే ! శ్లోకం రా ! నమ్మలిని అడ గ్గూడదూ? గాథ చదువుతామూ? (వాడు)చదువూ మరీ.(మొదటి వాడు) ఓ, చక్కగా చదువుతాను - తాంబూలంతో ఎఱ్ఱబడ్డ కామినీఅధరం చూచి మామనస్సు కూడా క్షోభిస్తూ వుంది. అయితే దారిద్ర్యమనే గురువుగారు వారిస్తూ వున్నారు [అని అర్థం. అందరూ-] ఓహోహో ! భట్టయజుస్వామి విదగ్ధపండితుడూ. విద్వాంసుడూ. మహాచక్కగా గాథలు చదువుతాడు. (ఇంకోడు) ఆవిడ పట్టుకొన్న ఆ పాదం ఏదోయ్ ? (ఇంక ఒకడు.) రాజాంగణంలో నేనూ చదివాను. మరిచాను. లోకం అందరూ చదవగలరు- ఈమాట విని రాజపుత్రుడు అనుకొన్నాడు - ఓహో పని లేని సోమరుల అసంబద్ధప్రలాపం !!-అని.

9. ఆవశ్యకనిర్యుక్తి— భద్రబాహు సూరి అనే జైనాచార్యుడు జైనగ్రంథకర్తల్లో గొప్పప్రసిద్ధిగాంచిన వ్యాఖ్యాత. ఆయన తాను రచించిన వ్యాఖ్యాగ్రంథా లలో ప్రాకృతవాఙ్మయంలోనుండి ఆనాడు ప్రసిద్ధంగా వున్న వుదాహర ణాలను చాలా ఇస్తుంటాడు. ఆయన ఉదాహరించిన ప్రాకృతపద్యాలు చక్కనివి- మచ్చుకు,

[1]శ్లో. లద్ధిల్లియం చ జోహిం అకరేంతో ణాగయం చ పత్థంతో,
దచ్ఛిసి జహ తం బిచ్ఛల ఇమం చ అన్నం చ చుక్కిహిసి.
(గీతికా)
సుత్థు వాయియం సుత్థు గాయియం సుత్థు వచ్చియం సామ సుందరి!
అణుపాలియ దీహరాయియయో సుమిణం తే మా పమాయయే.
(గాథా 1099, 1290)
ఏఉ సగడాలో భణయి జం సగడాలు కరెస్సయి,
నందరాయో మారే విఱు సిరియవు రజ్జే ఠవిస్సయి
(కథావళి పే 290)
వరరుయీ జింభరూవాణి మోయయే దాఉణ ఇమం పాఢేయి-
[2]శ్లో. రాయనందు న వి జాణయి జం సగడాలో కాహియి,
రాయ నందం మారేత్తా తో సిరియం రజ్జే ఠవేహియ.
సా భణయి.
న దుక్కరం తోడియ అంబయించియా
న దుక్కరం నచ్చిఉం సిక్ఖియాయే,
తం దుక్కరం తం చ మహాణుహావం
జం సో ముణీ పమయవణంమి వుచ్ఛో.

---

1 ఛాయ- లబ్ధం చ బోధి మకుర్వన్ అనాగతం చ ప్రార్థయమానః,
ద్రక్ష్యసి యథా త ద్విహ్వాల ః అస్మాచ్చాన్యస్మా ద్భ్రంశిష్యసి;
సుష్ఠు వాదితం సుష్ఠు గీతం సుష్ఠు నర్తితం శ్యామసుందరి!
అనుపాల్య దీర్ఘరాత్రీః స్వప్నాంతే మా ప్రమాదీః (ఆవశ్యకనిర్యుక్తి.)
ఏష శకటాలో భణతి య చ్ఛకటాలః కరిష్యతి.
నందరాజో మారయితవ్యో శ్రీయకం (చంద్రగుప్తం) రాజ్యే స్థాపయిష్యతి.
2 వరరుచిః డింభరూపేభ్యో మోదకా న్దత్వా పాఠయతి-
శ్లో. రాజా నందో నైవ జానాతి య చ్ఛకటాలః కరిష్యతి,
రాజానం నందం మారయిత్వా శ్రీయకం రాజ్యే స్థాపయిష్యతి.
సా భణతి-
శ్లో. న దుష్కరం త్రోటితాఽమ్రలుంబికా న దుష్కరం నర్తితం శిక్షితయా,
తద్దుష్కరం త చ్చ మహానుభానం య త్స మునిః ప్రమదావనఉషితః.
(ఆవశ్యకసూత్రవృత్తి.)

10. ఉత్తరాధ్యయనసూత్రం - దీనిపైని వాదిబేతాళసూరి గొప్పవ్యాఖ్య కూడా వ్రాశాడు. జైనుల ఆగమగ్రంథం కాబట్టి దీనికి కర్త ఎవరో చెప్పలేము. ఇందులోనూ బేతాళసూరివ్యాఖ్యలోనూ అక్కడక్కడా చాలా ప్రాచీనపు ప్రాకృతగాథలూ వాటిలక్షణాలూ వుదాహరిస్తూంటారు. ఇల్లాంటివి ఉపదేశపదంపై వ్యాఖ్యల్లో టీకాల్లో కూడా చాలా వుదాహరింపబడ్డాయి కూడా. ఒకటి రెండు మచ్చుకు -

శ్లో.[1] అధువే అసాసయంమి సంసారంమి దుఖపయురాయే,
కిం ణామ హోజ్జ తం కమ్మయం జేణాహం దుగ్గయిం న గచ్ఛేజ్జా.
జం గిజ్జయి పువ్వం ధువం చియ పుణపుణో సవ్వకవ్వబంధేసు,
ధువయం తి త మిహ తివియం ఛప్పయం చ ఉపయం ధువయం.

[ఏవం చ భగవతోద్గీతే తే ష్యైనమేవ ధ్రువకం ప్రత్యుద్గాయంతి.]

జవా లోహమయా చ్చేవ్వ చాలేయవ్వా సుదుఖరం,
జహా దుఖం భరేఉం జే జే హోయి వాయస్సకోత్థలో.
భాయరా మే మహారాయ సగా జిత్థ కణిత్థగా,
పుల్వేవ ముఠీ జహసే అసారే (ఇత్యాది).

ఉత్తరాధ్యయనసూత్రం ఆరంభం ఇల్లా వున్నది.

శ్లో. సంజోగా విప్పముక్కస్స అణగారస్స భిక్ఖుణో,
విణయం పాఉ కరిస్సామి అణుపువ్విం మణేహు మే.

---

1 అధ్రువే అశాశ్వతే హి సంసారే దుఃఖ ప్రచారకే,
కిం నామ భవతి తత్ కర్మకం యేనాహం దుర్గతిం న గచ్ఛేయం.
యద్ గ్రథ్యతే పూర్వం ధ్రువం చైవ పునఃపునః సర్వకావ్యబంధేషు,
ధ్రువకమితి తమిహ త్రివిధం షట్పదం చతుష్పదం ద్విపదం,
[ఇల్లాగే పూజ్యుడు ధ్రువకాన్ని చదివితే వారూ దీనినే పాడేవారు.]
యవా లోహమయా శ్చైవ చర్వయితవ్యా స్సుదుష్కరాః,
యథా దుఃఖం భర్తుం భవతి వాతస్య కోష్ఠ,
భ్రాతరో మే మహారాజ స్వకా జ్యేష్ఠకనిష్ఠకాః,
రిక్తేవ ముష్టి స్సోఽసారః, (ఇత్యాది)

ఆణాణిద్దేసకరే గురూణ ముఖవాయకారయే,
ఇంగియాగారసంపన్నే సేవిణీ యే త్తి వుచ్చయీ.
జహాసుణీ పూయికన్నీ నిక్కాసిజ్జయి సవ్వసో,
ఏవం దుస్సీలపడిణీ యే ముహరీ నిక్కాసిజ్జయీ.
కణకుండగం చయిత్తాణం విఠ్ఠం భుంజయి సూయరే,
ఏవం సీలం చయిత్తాణం దుస్సీలే రమయీ మిఏ.

1. గౌడవహో (గౌడవధ):- ఇది 12 వందల శ్లోకాలకు పైబడిన మహా కావ్యం. చక్కని (అంటే నిర్దుష్టం - అయిన) ప్రౌఢరచన గల కావ్యం. కవి సుప్రసిద్ధుడు. కావ్యం కూడా అట్లాంటిదే. మోనియరు విల్లియం-మొదలయిన పాశ్చాత్యపండితులూ పండిట్ శంకరపాండురంగపండితుల వంటి ప్రాచ్యపండితులూ కూడా అత్యధికంగా విమర్శించి ప్రశంసించిన మహా గ్రంథం. శైలికై ఒకటిరెండు పద్యాలిచ్చి విరమిస్తాను అల్పమతిని కనుకా.

ఇయ దే జయంతి కయిణో జయిమిణమో జాణ సయల పరిణామం,
వాయాసుత్థియం దీసయి ఆమోఘఘణం వ తుచ్ఛం వా.
ణియయా యే వచ్చియ వాయాఏ అత్తణో గారవం నివేసంతా,
జేయేంతి వసం సంచియు జయంతి ఇహ తే మహాకయిణో. (62-63)
మహుమహవియ యపవుత్తా వాయా కహణామమ మయులీఇమప్పి,
పఢమకుసుమాహి తళిణం పచ్ఛాకు సుమం వణలయాణం. (69)
అణుకంపా వా హాసో వా హోయి అవహీరణవ్వ గరుయాణ,
ఇయ రే సుఅణాయగుణంతరేసు న ఉణో హియయదుఖ్ఖం. (94)
అప్పా ఎత్తియమేత్తేణ వరవిరసోయి జస్స పడిహాయి,
సిరకమలాఉహ చలణేహిం కహావి జంగహియ బహుమాణో.
భవభూయి జలహిణిగ్గయకవ్వామయరసకణావ్వ,
ఫురంతి జస్స విసేసా అజ్జవి వియడేసు కహాణివేసేసు.
భాసమ్మి జలణమత్తే కంతీ దేవేయ జస్స రహుయారే,
సో బంధవేయబంధమ్మి హారియం దేవ ఆణందో.
(789-800) - గౌడవధకావ్యం.

12. చంద్రప్రభచరియం - ఇది ధనదేవుడనే ప్రాకృతనామమూ యశోదేవుడనే దీక్షానామమూ గల ఒక జైనపండితుడు రచించినప్రాకృతకావ్యం. విక్రమశకం 1192 వాడు. నవపదప్రకరణం వ్యాఖ్య మొదలయిన ఇతర గ్రంథాలు రాశాడు. సిద్ధరాజ జయసింహరాజ్యకాలంలో అణహిల్ల నగరాన ఉన్నాడంటారు. ప్రారంభం-

శ్లో. జస్సారుణచరణనహ పహాణరత్తా నమంత అమరపహూ,
అంతో అమంతనీహారియ భత్తిరాగవ్వ డీసంతి.

చివర—

సిరిదేవగుత్తసూరీ తస్స వి సీసో అహేసి సచ్చరణో,
తస్స వినేయేణ ఇమం ఆయిమధణదేవణామేణం.
ఉజ్ఝాపయయే పత్తంమి జాయ జసయేననామహేయేణ,
సిరిచందప్పహచరియం మయే కియం మందమయిణా వి.
సిరిధవలభండ సావియ కారియ యే పాససామిజిణభవణే,
అసాసల్లిపురీయే ఠియేణ ఏయం సమాఢత్తం.
అణహిల్లవాడ పత్తణే తయ ఋ జిణవీరమందిరే రమ్మే,
సిరిసిద్ధరాయ జయసింహదేవరజ్జే విజయమాణే.
ఏక్కారసవాససయేసు అయిగయేసు య విక్కమనివాయో.
అడసత్తరీయే అహియేసు కన్హతేరి సయే పోసస్స.

13. చతుష్పంచాశన్మహాపురుష చరిత్ర - ఇది శీలాంకాచార్యుడనే నామాంతరం గల విమలమతి అనే జైనపండితుడు రచించిన చరిత్రగ్రంథం. శీలాంకాచార్యుణ్ణి శీలాచార్యుడూ అనికూడా పిలుస్తారు. ఈయన ఆచారాంగానికి వృత్తి వ్రాశాడు. చతుష్పంచాశన్మహాపురుష చరిత్రను మహాపురిస చరియం - అని కూడా అంటారు. కాని గ్రంథకర్త నిర్దేశించిన పేరు చఉప్పన్న మహాపురిసాణ చరియ- అని.

శ్లో. చఉప్పన్నమహాపురిసాణ ఏత్థ చరియం సమప్పయే ఏయం.
సుయదేవయాయే పయకమలకంతి సోహాణుహావేణ.

ఈయన నిర్వృతికులీన మానదేవసూరిశిష్యుడు. కుమారపాలుని రాజ్యంలో వున్నాడు. విక్రమశకం 9వ శతాబ్దివాడు.

శ్లో. ఆసి జసుజ్జజోహ్ణధవళియ నేవ్వయకులంబరాభోయో,
తుహిణ కిరణోవ్వ సూరీ ఇహయిం సిరిమాణదేవో త్తి.
సీవేణ తస్స రయియం సీలాయరియేణ పాయడపుడత్థం,
సయలజణజోహణత్థం పాయియభాసాయే సుపసిద్ధం....
సయణు పరియణు బంధువగ్గం పి ఖిచ్చయణు,
సుహి సజ్జణు వి షురి కలత్తు అణావడిజ్జఉ.
అత్థుమ్మ కిల ఘరిఘరయి జాన, తావ పుణ్ణోహిం సమగ్గలు-
(చతుష్పంచాశన్మహాపురుషచరిత్ర)

14. **చాఉరంగిజ్జం** -

చత్తారి పరమంగాణి దుల్లహాణీహ జంతుణో,
మాణుసత్తం సుయీ సద్ధా సంజమం మియవీరియం.
సమావన్నాణసంసారే నాణాగోత్తాను జాయిసు,
కమ్మా నాణాకిహా కత్థు పుత్తో విస్సం భియా, పయా.
సముద్దగంభీర సమా దురాసయా,
అచక్కియా కేణవి దుప్పహంసయం,
మయస్స పుణ్ణా విపులస్స తాయిణో
ఖవిన్ను కమ్మం గయి మత్తమం గయా.

ఇది ఏగ్రంథకర్తదో తెలియదుగాని, రెండువేలశ్లోకాలూ 40 కథలూ గల గ్రంథం. చాలా ధారాళమైనరచన. ఎన్నో లోకోక్తులు. చక్కనివాక్చాతుర్యం కలిగి వున్నది. ఇంతకంటెను దీన్ని గురించినవివరం తెలియదు.

15. **జంబూచరియం**- కర్త ఎవ్వరో తెలియదు. కాని ప్రద్యుమ్నసూరి పట్టధర వీరభద్రాచార్యుల శిష్యుడట.

శ్లో. నమిఉం దుక్ఖరంతసమత్థసత్థసత్థభవజలహితారణసమత్థే,
పాయే చక్కుంకుసకువిసలంఛియే జిణ పదాణం....

భవ్వకుమోహోహపడిబోపంపచ్ఛలో పావతిమిరనిత్థవణో,
ఆసీ ససివ్వపరశో సూరీ పజ్జున్నవరణామో.
జోదంపణనాణచారిత్తసీలతవసంజమేసు కుసలమయీా,
జయియో గుణగణకవియో ముత్తిధమ్మో య అవయరియో.
తస్స య పయంమి జాయో ఆయరియో వీరభద్దనామో త్తి,
పరిచింతియదిన్న ఫలోఆసీ సో కప్పరుక్ఖో త్తి.
జస్స య సీసో పయకో పయడియమూణత్తపరమత్థో,
దంసణచారిత్తధరో సూరి పజ్జున్నణామో త్తి.
అన్నేవి జస్సబహవే సీసా జయియణగుణేహిం పరికలియా,
సంజాయా ధమ్మరయా సద్దంసణనాణచరణ పాహడ్డా.
గుణపాలణేక్కణిత్తేణ సాహుణా పవయటాభత్తేణ,
సీసేణ తస్స రయియం చరియ మిమం జంబునామస్స.

**16. జినదత్తాఖ్యానం—** సమతిగణి రచించిన ప్రాకృతకావ్యం, జినదత్తకథ అని జినదత్తచరిత్ర అని మఱిరెండుగ్రంథాలు కూడా వున్నవి. కాని అవి సంస్కృతములు. సుమతిగణి నేమిచంద్ర సూరిశిష్యుడు. గొప్పజ్ఞాని.

శ్లో. జయఉ విణిజ్జియదుజ్జయ దురంతకందప్పదప్పమాహప్పం,
దుత్థకమ్మదోగట్టకేసరీ జిణవరో వీరో.
ఆసీ అనేసమేయిణిఅస్సంతభమంతకిత్తిపబ్భారో,
సిరినేమిచందసూరీ పాడిచ్ఛయగచ్ఛకప్పతిమో.
చందో వ్వ అమలముత్తీ సూరోఇవ సత్తవాయిసంపణ్ణో,
సింధువ్వవివిహరయణో వపోహియో నీరసహిహియోయ
జోసోఉత్తమగుణరయణవిఉలనిద్దోసకోసభూయేహిం,
సిరిసవ్వదేవసూరిత్థావియోఉత్తమపయంమి.

**17. ధమ్మవిహి—** దాదాపు 12 వందల శ్లోకాలకు తక్కువలేని ప్రాకృతగ్రంథం. జినధర్మం వెల్లడిస్తూ వ్రాసినగ్రంథం. అతిసులభమైనరచన. అనేక గ్రంథాలను సంగ్రహించి తెలుపుతున్నానని చెప్పుకొంటాడు. కర్త ఎవరో ?

శ్లో. కిజ్ఞాహరనరకిన్నర....పయిసిరమడడఘట్టపయవీఢం,
సిరివచ్ఛం కియవచ్ఛం పణమామి జిణేయరిసభం.
వోచ్ఛమహం ధమ్మవిహిం సమత్థసత్తాణ ఉద్ధరేడూణ,
భవియజణబోహణాత్థం సుమచయా సన్నసూరీహిం....
ధమ్మవిహిప్పగరణ మిమం విసోహగం నాణదంసణగుణాయిం,
వసదిక్కంతేహిం జుయం సమ్మత్తం దేవ సివసోఖ్ఖం.

18. **దాఠావంశో**— ఇది సుప్రసిద్ధగ్రంథం. రిచర్డు మోరిసు (M.A.)మున్నగు పాశ్చాత్యపండితులూ, ఖంతారక్షక మొదలయిన ప్రాచ్యపండితులూ దీని పైని ఎన్నెన్నో చర్చలు సలిపారు. 1884 లో మొదటికూర్పు పడ్డది. కవితాశైలి చూపడమే నాపని. గనుక మచ్చుకు ఒకటిరెండు పద్యాలు -

శ్లో. విశారయం వాయపహాతివత్తినం
తిలోయపుజ్జం తమసహ్యశాహినం,
అసేసనేయావరణప్పహాయినం
ణమామి సత్తార మణంతగోసరం.

తిలోయణాహప్పహవం భయావహం
విసుద్ధవిజ్జాచరణేహిం సేవియం,
పపంచసణ్ణోజనబంధనచ్ఛిదం
ణమామిధర్మం జీవుణం సుదుద్దసం.

పసాదమత్తేవియ జత్థ పాణినో
వుసంతి దుఖ్ఖాఖ్ఖం అనచ్చుతం పదం,
తమాహనేయం సుసమాహియే దియం
ణమామి సంఘం మునిరాయశావకం.

విభూసయం కాలకనాగరాన్వయం
పరక్కమో కారుణియో చమూపతీ,
గవేసమాణో జిణసాసనస్స యో
విలోహిమత్తాణజణస్సపత్తయం.

19. **నేమిచరియం**— ఇది మలధారి హేమచంద్రునికృతి. ఈయన భవభావనా వృత్తి మొదలయిన గ్రంథాలు వ్రాశాడు. దాదాపు వేయి శ్లోకాలుగల గ్రంథం. 11 వ శతాబ్దిదని కొందరూ 10వ శతాబ్దిదని కొందరూ అంటారు.

శ్లో. అజ్జవి జస్స పవత్తయి ధమ్మోసీయా య భరహవాసమ్మి,
తం పఢమజిణవరం పణివయామి ణిద్దలియదురియోషం.

ఇందులో నేమినాథుడు తొమ్మిదిభవములలో చేసిన వృత్తాంతములు సరసంగా కూర్చబడి వున్నవి.

20. **నర్మదాసుందరీచరియం** — ఇది మహేంద్రసూరి రచించినది. ప్రాకృత భాష. ఇందులో శీలమాహాత్మ్యం హెచ్చుగా వర్ణితమై వున్నది. శీలోపదేశ మాలావృత్తి మొదలయిన గ్రంథాలలో ఈకథ వస్తుంది.

21. **నేమినాథచరిత్ర**— హరిభద్రసూరి రచించినది. ఈయనే ప్రాకృతంలో- చఉవీస జిణపుంగవ సుచరియ రయణాభిరామ సింగారో - అని తాను చతుర్వింశతి జినపుంగవచరిత్ర వ్రాశానని చెప్పుకొంటాడు. ఎనిమిదివేల శ్లోకాలు గల గొప్పకావ్యం. చాలా రసవత్తరంగా వుంటుంది అంటారు. అచ్చుపడలేదు. లయతాళం- నడక విచిత్రంగా నడుపుతూ ఇప్పటికీ జైన పండితులు గానంచేస్తారు ఇందులోని గీతాలను.

మచ్చుకు- (ఆరంభంలోనే)

(1) దుహవియడియ కరణ ఆయాడ,
మహదంసియ ధమ్మనిహి దుహనమంతవిషయపారణు.
దుషకమణాణందయరు, దుహసువణ్ణరయణప్పహావణు,
మహసుహు వియరియు విమలగుణరాసి జలహిరయణిందు.
పణయసురాసురనరనియరకయథుయి రిసహ జిణిందు.

22. **నాలాయణం**— మాణిక్యసూరి రచించింది. కుబేరపురాణం- అని కూడా ఇంకోపేరు వుంది. 12వ శతాబ్దివాడు. ఇది పదిస్కంధాలున్నూ ఒక్కొక్క దానికి పదేసిసర్గలున్నూ గల మహాగ్రంథం. యశోధరచరితం అనుభవ

సారం మొదలయిన గ్రంథాలు వ్రాసినట్లు చెప్పుకొన్నాడు. ఇది ఇంకా ముద్రితం కాలేదు.

23. **పంచమీకహ—** మహేశ్వరసూరిది. అచ్చైంది భవిస్సయత్తకహ (భవిష్య ద్దత్తకథ) అని కూడా మఱో పేరున్నది. అపభ్రంశప్రాకృతంలో వ్రాయబడిన మహాగ్రంథం. చక్కని శైలి. మంచి కథాగ్రంథము కూడాను. గ్రంథకర్త తననుగురించి కేవలం- సజ్జనోపాధ్యాయుశిష్యుణ్ణి అనుకోవడం తప్ప మఱేమీ చెప్పుకోడు. ప్రాకృతభాషలో 2000 శ్లోకాలకు మించిన గ్రంథం. పది పెద్దకథలు ఇందులో వున్నవి.

శ్లో. దోపక్ఖుజ్జోయకరో దోసాసంగేణ వజ్జియో అమయో,
సిరిసజ్జణఉజ్ఝాయో అవువ్వచందువ్వ అక్ఖత్థో.
సీసేణ తస్స రయియా దసవి కహాణాయి మేఉ పంచమియే.
సూరిమహేసరయేణం భవియాణం బోహణత్థాయే.

24. **పంచమీకహ—** ధనపాలమహాకవిది. ఇదిన్నీ దాదాపు అంతటిగ్రంథమే. వాఙ్మయపరిశ్రామికులకు ఇందులో ఎన్నెన్నో వింతలూ విశేషాలూ కనిపిస్తవి. కథ మహేశ్వరసూరిగ్రంథంలోదే. పాకం వేరు.

1. అహిణవరంభగబ్భసోమాలఉ
ధణవయిఘరిపరివడ్ఢయిబాలఉ
కమలసిరిహిపీణుణ్ణయసట్టియం
పిల్లివిహాతుపియయి ధణవట్టిహిం.

2. హత్థి హత్థు భమయిం జణకిందహో
చరియసుహావహు సుత్థు ణరిందహో
ణరణాహిం సయిం అంకిలయిజ్జయి
చామరగాహిణీహిం విజ్జజ్జయి.

పరమ విలాసిణీ హిం చుంబిజ్జయి
అణ్ణహిం పాసిడు అణ్ణహిం విజ్జయి.

25. **కుమారపాలప్రతిబోధ :-** సోమప్రభాచార్యరచితం. చక్కని రచనం. గద్యపద్యాలలో రచన పరుగులెత్తుతూ వుంటుంది. ముద్రితమైంది బరోడా వారి సంస్కృతగ్రంథమాలలో. ఉదాహరణం (నలునికథనుండి)-

రన్నా భణియం- కో ఏసో నళో ? గురుణా వుత్తం-సుణు!

శ్లో. అత్థి ఇహ భరయఖిత్తే కోసలదేశంమ్మి కోసలా ణయరీ,
జాయాంతిగుణావసణస్స హేయుణో జత్థ ఆచ్ఛరియం.

శ్లో. ఇక్ఖాగుకులుప్పణ్ణో నిరువమనయచాయలిక్కమప్పుళ్లో,
అరిపత్థియదివ్వినహో నిసహో నామేణ తత్థనివో.

తస్స సుందరిదేవీ కుఖిసంభూయా జణమణాణంద హేదుణందణా నలో కూబరోయ విదబ్భదేసమండణం కుండిణం నయరం, తత్థ అరి సంఘసింహసరహో భీమరహో రాయా. తస్స సయలం తేవురతరు పుప్ఫం పుప్ఫదంతీదేవీ !

26. **పృథ్వీచంద్రచరియం** - దీనిని శాంతిసూరిపండితుడు విక్రమశకం 11 వ శతాబ్దిలో రచించాడు.

శ్లో. ఇగతీసాహియసోలషసయేహిం వాసాణనివ్వుయే వీ,
క త్తియచరమతిషియే కి త్తియరిఖ్ఖేపరిసమత్థం.

27. **పార్శ్వనాథచరియం** - దేరభద్రసూరి రచించాడు. 9 వేల శ్లోకాలుగల ప్రాకృతగ్రంథం ఇంకా అచ్చుకాలేదు.

28. **లీలావయీకహా :-** దీనినే లీలావతీ అనికూడా అంటారు. ఇది 192[illegible] వఱకు ఉన్నదని చాలామంది ఎరగరు. అందులో తెలుగువారికి దీనిని ఎరు[illegible] పఱచింది శ్రీయుతులు మానవల్లి రామకృష్ణకవిగారు ఇందులో శాతవాహ[illegible] మహారాజు సింహళద్వీపపు రాజకుమారిక సంయోగము ఉపవర్ణిత మైనది దీనిని రచించినకవి తనపేరు చెప్పుకొనలేదు. అసారమతి యని తను[illegible] దా చెప్పుకొన్నాడు. కవి తాత బహుళాదిత్యుడనీ, తండ్రి భూషణభ[illegible] అనీ, వారిద్దరు నాల్గువేదముల నధిగమించినవారనీ యజ్ఞయాగాదిక్రియ[illegible]

కర్మృతులనీ చెప్పుకొన్నాడట. హేమచంద్రాచార్యుని కావ్యానుశాసనము నందున్నూ వల్లభాచార్యుని న్యాయలీలావతీయందున్నూ భోజదేవుని దౌత్య ప్రకాశం లోనూ- ఈ లీలావతి పేర్కొనబడినదట. రామకృష్ణకవిగారు గ్రంథకర్తకాలం షుమారు క్రీ 6-7 శతాబ్దులమధ్యనై యుండుననిన్నీ, లాల్చందుభగవాన్‌దాసు గాంధిగారు 12వ శతాబ్దిలోనో అంతకుపూర్వమో అయి వుంటుందనిన్నీ నిర్ణయిస్తూ వున్నారు. కథావస్తువు మిక్కిలీ మనోహరంగాను శోకకరుణరసాలు వెల్లివిరిసేట్టున్నూ వర్ణింపబడ్డది అంటారు. గ్రంథం నేను చూడలేదు. రామకృష్ణకవిగారు కాపీచేయించి తెప్పించారని వింటున్నాను. ఈ క్రింద ఉదాహరించే శ్లోకాలు కవిగారి వ్యాసంలోనూ గాంధిగారి పుస్తకసూచిలోను ఉద్ధరించి ప్రదర్శించినవి అని చదువరులకు మనవి.

ప్రారంభంలో :-

శ్లో. నమహ సరోససుయరియ సణసవ్వవియం కరరుహావళీజుయలం,
హరిణక్కసవియడోరత్థలత్థిదలగబ్భిణం హరిణో. (1)
తం ణమహ జస్స తయియా తయియదయం తిహూయణం తులంతస్స,
సాయారమణాయారే అప్పణ మప్పచ్చియ నిసణ్ణం. (2)
తస్సేన పుణో పణమహ నిహుయం హావిణా హసిజ్జమాణస్స,
అపహుత్త దేహకీలం ఘణద్ధవహసంఠియం చలణం. (3)
సో జయఉ జస్స పత్తో కంఠేరిత్థాసురస్స ఘణకసణో,
ఉప్పాయపవడ్ఢియకాలవాలకారిణీ భుయప్పవిహో. (4)
రక్ఖంతు వో మహోవహిసయణే సేసస్స ఫణిమణిపయీవా,
హరిణో సిహిసిహిణోత్థయకోత్థహంకందంకురాయారా. (5)
హరిణో జమలజ్జుణరిత్థకేసికంసస్స సురింద సేలాణ,
భంజణవళణవియారణ కట్టణధరణే భుయే ణమహ. (6)
కక్కసభుయకోప్పరపూరియాణణో కఢిణకయకరాలేసో,
కేసికిసోరకయత్థణకఉజ్జమో జయయి మహుమహణో. (7)

సో జయఉ జేణ తయలోయకవలణారంభగబ్భియము హేణ,
ఓసావణి వ్వ పీయా సత్త వి చులయత్థియా ఉహాయీ. (8)

........ అహవా—

శ్లో. సో జయఉ జేణ సుయణా వి దుజ్జణా ఇహ విణిమయా భుయణే,
న తమేణ విణా పావంతి చందకిరణా వి పరిహోవం. (13)

దుజ్జణసుయణాణ ణమో ణిచ్చం పరకజ్జ వావడమణాణ,
ఏక్కే భసణసహాహే పరదోసపరమ్ముహే అణ్ణే. (14)

అహవా న కోవి దోసో దీసయి సయలంమి జీవలోయమ్మి,
సవ్వోచ్చియ సుయణయణో జం భణిమో తం నిసామేహ. (15)

....ఆసి తివేయతిహోమగ్గిసంగసంజయణియతియసపరియోసో,
సంపత్త తివగ్గఫలో బహుళాయిచ్చోత్తి ణమేణ. (19)

అజ్జవి మహగ్గిపసరియధూమసిహాకలుసియం వ వచ్ఛయలం,
ఉవ్వహాయి మయకలంకచ్ఛలేణ మయలంఛణో జస్స. (20)

తస్స య గుణరయణమహోవహీస్సే ఏక్కో సుయో సముప్పణ్ణో,
భూసణభట్టో ణామేణ నియయకులణహాయలమయంకో. (21)

జస్స పియబంధవేహిమ్మి చఉవయలిణగ్గయే హిం వేయేహిం,
ఏక్కవయణారవిందత్థియేహిం బహుమణ్ణియోఅప్పా,

తస్స తణయేణ ఏయం అసారమయిణావి విరయియం సుణహ,
కోఊహలేణ లీలావయిత్తిణామం కహారయణం. (23)

ఈక్రింది శ్లోకాలు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు-(క్రోధన మాఖమాసపు) భారతిలో లీలావతీ కావ్యాన్ని గురించి పుష్పాంజలి అనేపేరుతో వ్రాయుచు ఉద్ధరించి వ్యాఖ్యానించినవి. శ్రీవారు లీలావతీకావ్యాన్ని కాపీచేయించి తెప్పించారనీ దానిని ఆంధ్రంలోకి తర్జుమాకూడా చేయించారనీ తెలిసింది కొందఱుమిత్రులద్వారా. ఎప్పుడు వస్తుందో. వీనిలో(18వది) శాతవాహనుని గ్రంథం చివఱ పేర్కొన్నది. 2, 3, 4, 5 లు భోజదేవుడు అనురాగప్రకాశలో - 321, 435, 487 గా

పేర్కొన్నారని, వారే చెప్పారు. ఆరోది ప్రాకృతప్రాశస్త్యాన్ని తెలిపేది లీలావతి లోనిదే. ఏడవది లీలావతిలో 777 వ పద్యమట 8, 9, 10, శాలివాహనివర్ణన సందర్భమువి. 11 వది లీలావతిలోని మధుపానవర్ణనలోనిదట. 12, 13, 14-లు ఆంధ్రదేశంలోని చారిత్రికప్రాంతాలను వర్ణించేవిన్నీ అసలు లీలావతిలో- 190, 242, 1147 సంఖ్యగల శ్లోకాలున్నూ, 16, 17 శాలివాహనుని హాలత్వ స్ఫోరకాలు. 18, 19 లు నాగార్జునప్రశంసాకములు. 20-21 సింహళవర్ణనపరములు. చదువరులు ఈ ప్రతీతులు మనసునందుంచుకొనే ఈక్రిందిపద్యములు చదువవలయు నని ప్రార్థితులు.



శ్లో. (1) జయి వఢయి సాయశాయణ గంధవ్వకళంజ....తుంబురుణా,
సరరువిణోదేణ కిదం నాడయగేయం సలక్ఖణం యేదం.

(2) తా కిం బహు యేహింమ్మి చింతియేహిం నళకూయరో వరో హోయి,
విత్తాహివస్స తణయో గయముహ మహతుహపసాయేణ.

(3) జం అణుయి యం కుమారీఅణస్సలజ్జాయే సాహియకులస్స,
తం సవిసేసం పియసహి మహ హయహియయేణ పారద్ధం.

(4) తం సిద్ధఉమారం పేచ్ఛియూణ ఏయేహిం సహియణజ్జేహిం,
అవిణయ మగ్గో హయలోఅణాహిం నీయమ్హ్ కిం భణిమో.

(5) ణ సహయి కాలక్ఖేవో హియయం మహ మయణహుఅవహపతిత్తం,



తస్స వి సందేహగయం నిసుయం చియ తడో వి.

(6) భణియం చ పియయమాయే రయియం మరహట్టభాసాయే,
అంగాయిం ఇమీ కహాయే సజ్జణా సంగజోగాయి.

(7) అహ కహ వేయజడస్స తస్స వినయాహిలాసవిముహస్స,
నిప్పజ్జయి లోయపియామహస్స ఏవంవిహం రూపం.

(8) జోసో అవిగ్గహో వి హు సవ్వాంగావయవసుందరో సుహయో,
దుద్దంసణో వి లోయణలోయణాణం దసంజణణో.

(9) కువయీా వి వల్లహో పణయియాణ తహ నయవకో వి
సాహసియో,
పరలోయభీరుయో వి హు వీరేక్కరసో తహచ్చేయ.

(10) సూరో వి సత్తాస్సో సోమో వి కలంకవజ్జియో నిచ్చం,
భోయీా వి న దోజీహో తుంగో వి సమీవదిన్నషలో.

(11) వివిహాయిం వివిహవణ్ణుజ్జలాయిం సహయావసురహివాసాహిం,
నీలుప్పలపరిమళ వాసియాయిం దిజ్జంసి పాణాయిం.

(12) తం సత్తముహవిహత్తంబునివహనిద్ధోయ కలిమలుప్పంకం,
కహకహవి దేవ సుయిరేణ సత్తగోయావరీభీమం.

(13) ఇయతస్సకణయదేవాలయస్స దాహిణదిసాయి అణులగ్గం,
గోలాణయివయణవిసేసయం వరమ్మం మతాయయణం.

(14) ఏవం భణియో సో తేణ నరవయీాయకణియేహిం దియహేహిం,
సంపత్తో కమలదళచ్ఛి సత్త గోయాయరీభీమం.

(15) తో గురువయణేణ ఏసా తం చియవష మన్నిఊణ తహ భణియం,
సవ్వాయరేణ హాలస్య పేసియావచ్ఛహో పహవో.

(16) బహుమన్నతో తంచియ మరణం సంతోసదిన్నని యహియయో.

(17) నాయజ్జుణోవరోహేణ నిగ్గయో నియపురాహిం తో.

(18) నాయజ్జుణభిక్ఖుపురస్సరేణ సరితీరసంఠియో రాయా,
విజయాణందేణసమం వివరాహుత్తం పరిక్కంతో.

లక్ఖిజ్జయి అజ్జవి గుంజిరాళిఉలవలయవాయులలఆహిం,
మహణుత్తిణ్ణే రావణ్ణమగ్గో సత్తిచ్ఛయతరూహిం.

సేవిజ్జయి సరసో హంసకణయభవణేసు సిద్ధమిధుణేహిం,
జమ్మిలవంగేలావణ పరిమళవాసియో పవణో. (20-21)(ఇత్యాది)

29. **వసుదేవహిండీ :-** ఇది సంఘదాసవాచకులు రచించినది. ప్రాకృతభాషలో అతివిస్తృతములుగా వ్రాయబడ్డ వసుదేవచరిత్రల్లోకి ఇది మిన్న. ఈయన హరిభద్రసూరికంటెనూ ప్రాచీనుడనిన్నీ మహత్వంచకల్పభాష్యం మొదలయినగ్రంథాలు ప్రాకృతంలోనే వ్రాశాడనిన్నీ అంటారు.

30. **విలాసవతీకథ :-** ఇది 11 సంధులుగల గొప్ప అపభ్రంశభాషాకావ్యం అనీ సమరాయిచ్చకహలోనుండి ఉద్ధరించి పెంపుచేయబడ్డదనీ, కవే చెప్పుకొన్నాడు. కావ్యంపు ఆరంభం అంతం ఇట్లావున్నది :-

ఆరంభం:-

బహురయణమనోహరు నిమ్మల
పయహరు సగుణు సువణ్ణాహిత్థియవు,
భణ కస్స న సోహయి నయణు
మోహయి కవ్వహారు కంఠత్థియహు.

పఢమం పణమేవిణు ఉసహసామి
పుణు అజిఉవి వినిజ్జియభయు ధుణామి,
సంభవు భావేవిణు భవవిణా
సణు వందిలి అభినందణు గుణనిధాణు.

అంతం :-

పాణిజ్జమూలయూలే కోడియగణవిఉలవయిరసాహాయే,
విమల పియచందఉలే వంసమ్మియ కవ్వకలాణం.
సంతాణేరాయసహసిహరిభప్పభట్టిసూరిస్స,
జసభద్దసూరిగచ్ఛే మహు రాదేసే సిరోహాయే,
ఆసి సిరిసంతిసూరీ తస్స వి సీసో జడమయియో,
సాహారణోత్తి ణామం సుపసిద్ధోఅత్థి పువ్వణామేణం.

మధ్య :-

జణ ఏక్కు ఖణంతరు ఖంపు దేవు అఖ్ఖంమి ధమ్మక్ఖరు తం సుణేవు,
జాయ దూమిజ్జయి అణ్ణులోఉ తా వరి కిఉ ధమ్మకహావిణోవు.

జావయ పరిద త్తిహిం జాయి కాలు తావరి పరిభావిఊ కమ్మజాలు,
సవ్వహో పరదోసుప్పడణేణ గుణుకవయు హోయి చింతహు
మణేణ. (ఇత్యాది.)

31. **వ్యవహార వివరణం**- ఇది ఎవరు చేశారో తెలియదు. ప్రాకృతంలో వ్రాయబడిన గొప్ప భాష్యగ్రంథం. వ్యవహారచూర్ణిభాష్యం అనికూడా దీనికి మఱోపేరు. చాలాశాస్త్రచర్చగల గ్రంథం.

32. **వజ్జాలగ్గం**- ఇది చక్కని అలంకారగ్రంథం. సరసమైనశయ్య. కవిత పరుగెత్తుతూ హాయి అనిపిస్తుంది. కావ్యశోభలూ లక్షణశోభలూ రెండూ ఉన్నవి. దాదాపు వేయిశ్లోకాలకు పైగాగల గ్రంథం. అన్ని కావ్యభాగాలు (వ్రజ్య) వజ్జలలో విభక్తాలు అయినవి. వజ్జాలగ్గగ్రంథకర్త జయవల్లభ సూరి అంటారు. మచ్చుకు సోయరవజ్జ (శ్రోతృవ్రజ్య)లోనుండి కొన్ని శ్లోకాలు. దీన్ని ఏ అనంతకృష్ణశర్మగారో ఆంధ్రీకరిస్తే ఎంతో ముచ్చటగా ఉంటుంది. కవి ఏ కాలంవాడో నేను చెప్పలేను.

శ్లో. దుఖ్ఖం కీరయి కవ్వం, కవ్వమ్మి కియే పయుంజాణా దుఖ్ఖం,
సంతే పయుంజమాణే సోయారో దుల్లహా హోంతి.

సక్కయం అసక్కయం పిహు అత్థో సోయారసంగమవసేణ,
అప్పవ్వరస విసేసం జణేయిజం తం ముహచ్చరియం.

ముత్తాహలం వ కవ్వం సహావవిమలంసువణ్ణసంఘడియం,
సోయారకణ్ణకుహరమ్మి పయడియం పాయడం హోయి.

కవ్వవజ్జనుండి.-[అంటే కావ్యవ్రజ్యనుండీ-మఱికొన్ని]-
సద్దావసద్దభీరూ పయేపయే కింపి కింపి చింతంతో,
దుఃఖేవి కహవి పావయి చోరో అత్థం కయీ కవ్వం.

సద్దపలోత్థం దోసేహిం వజ్జియం సులవియం పుఢం మఘరం,
పుణ్ణేహివి కహ పావయి ఛందే కవ్వం కళత్తం చ.

అణవరయబహుళరోమంచకంచుయం జణియజణమణాణం విదం,
జం ణ ధుణాణయి సీసం కవ్వం పేమ్మం చ కిం తేణ ?

దీని అర్థం ఇదీ:- కవి అతికష్టపడి కావ్యం చేస్తాడు. చేసింతర్వాత దాన్ని లోకంలో ప్రచారానికి తీసికోరావడానికీ చాలా కష్టపడతాడు. ఒకవేళ ప్రయోగించినా (ప్రచారానికి తెచ్చినా) వినేవాళ్ళు దుర్లభంఅవుతారు. సంస్కృతంకానీండి అసంస్కృతకావ్యం కానీండి, అర్థస్ఫూర్తి అనేది వినేవారు లభించడంపైని ఆధారపడి వుంటుంది. అల్లాంటిశ్రోతలు దొరికీ, అది అపూర్వరసవిశేషాన్ని గలిగించడం అనేది చాలా వింతఅయినవిషయం. ముత్యాలకోవలాగా కావ్యంసహజంగా విమలంగానూ స్వర్ణసంఘటితంగానూ ఉంటుంది. శ్రోతలకర్ణకుహరాల్లో ప్రవేశించి ప్రకటం అవుతుంది. (కవ్వవజ్జ) శబ్దమే వస్తుందో అపశబ్దమే వస్తుందో అని భయపడుతూ వున్నవాడై మాటమాటకూ ఏమేమో ఆలోచించుకొంటూ ఎల్లాగో (కవిత) దొంగసొమ్ముకోసరం కవి కవిత్వంకోసరం కష్టించి పొందగలుతారు. పదాలపొందికా - దోషవర్జనం-లాలిత్యమూ విస్పష్టతా, తీయందనమూ అనేవిగల భావ్యానూ కావ్యమునూ ఎంతోపుణ్యంచేతనే లభిస్తాయి. సదా రోమాంచాన్ని గల్గిస్తూ విన్నవారికి ఆనందాన్ని వెల్లివిరియిస్తూ, తల పంకింపచేస్తూ వుండనట్టి కావ్యమున్నూ ప్రేమా కూడా నిష్ప్రయోజనాలు-అని తాత్పర్యం ఏర్పడుతుంది.

33. **శాంతినాధచరితం**-దీన్ని ప్రాకృతంలోనే పణ్డెండువేల శ్లోకాలగ్రంథంగా రచించాడు దేవచంద్రసూరి. సుప్రసిద్ధుడై సంస్కృతప్రాకృతాలలో ఆచార్యుడని పేరుపొందిన హేమచంద్రాచార్యునికి ఈయన గురువు. ఇంతవఱకూ అచ్చుకాలేదు ఈ గ్రంథం. ప్రాకృతపరిశ్రామికులకు నిధి. జేసల్మేరు భాండాగారంలో వున్నది.

34. **శత్రుంజయోద్ధారం** - ఋషభదాసు. ఈయన రాజపుత్రుడని కొందరూ, కాదు సాంగణ శ్రేష్ఠివంశం వాడని కొందరూ వివదిస్తారు. అతిప్రాచీనమైన ఘూర్జరప్రాకృతంలో 10 వేల గ్రంథంగా దీన్ని ఈయన వ్రాశాడు. ప్రాకృతం పరిశ్రమచేసేవారికి అమోఘములయిన ఎన్నో దేశీపదాలూ వృత్తాలూ అద్భుతంగా ఇందులో లభిస్తవి.

35. **సమరాయిచ్చకహా** - సాధారణాంకసిద్ధసేనసూరి రచించాడని కొందరూ, హరిభద్రుడిదని కొందరూ వాదిస్తారు. అచ్చైంది. చాలా గొప్పగ్రంథం. శైలి ఉయ్యాలలు ఊగుతూవుంటుంది. గద్యంలో పద్యంలో కూడా శైలిని

బట్టి హరిభద్రుడిదే అనడం న్యాయమనిపిస్తూవుంది. కొంచెము మచ్చు చూడండి కవిత ఎల్లాంటిదో-

ప్రారంభం:-

పణమహ విజియసుదుజ్జయనిజ్జియసురమణుయవిసమసరపసరం,
తిహుయణమంగళనిలయం వసహగయిగయం జిణం ఉసహం. (1)

పరమసిరివద్ధమాణం పణడ్డమాణం విసుద్ధవరణాణం,
గయజోయం జోయిూసం సయంభువం వద్ధమాణం య. (2)

పేసేచియ వావీసే జాయిజరామరణబంధణవిముక్కే,
తేలోక్కమత్థయత్థేతి తిత్థికరే ఖాపయోణమహ. (3)

దేహుసుహం వో సురసిద్ధమణుయవందేహిసాయరం నమియా,
తిత్థియరవయణపంకయవిణిగ్గయా మణహరా వాణీ. (4)

అలం పవిత్థరేణ! సుణహ సోయవ్వాయిం. పసంసహ పసంసయియవ్వాయిం, పరిహరహ పరిహరియవ్వాయిం ఆయరిహ ఆయరియవ్వాయిం, తత్థ,

శ్లో. సోయవ్వాయి జరామరసివసుహజణయాయి అత్థసారాయిం,
సవ్వన్నుభాసియాయిం భువణంమ్మి పయత్థియజసాయిం.

శ్లో. తాయించియవిజుహాణం పసంసణిజ్జాయి తహయజాయిం చ,
తేహించియ భణియాయిం సమ్మత్థన్నాణచరియాయిం.

36. సముద్దపాలీయం.-గ్రంథకర్త పేరేమో తెలీదు. కాని చక్కనిఅనుష్టుప్పుల్లో 500 శ్లోకాల గ్రంథం ఉన్నది. చక్కనికథలు శైలి ప్రశస్తమైనదే. రెండు శ్లోకాలు ఉదాహరణార్థం:-

శ్లో. చంపాయే పావియేణామ సావయే ఆసి వాణియే,
మహావీరస్స భగవయో సీసే సోఉ మహప్పణో.
నిగ్గంథే పావయణే సావయే సేవి కోవియే,
సోయేణ వవహారం తే పిహుడ్డం నగరమాగయే.

పిహుడ్డే వవహరంతస్స వాణియో దేయి ధూయరం,
తం ససత్తం పయిగిజ్ఝసదేసపత్థియో.

37. **సుమతినాథచరిత్ర**-గ్రంథకర్త ఎవ్వరో తెలియదు. కాని 9500 శ్లోకాలుగల మహాగ్రంథం.

38. **సూక్తిముక్తావళి**-లేక సిందూరప్రకరం-దీనికే సోమశతకం అనికూడా మఱో పేరు ఉంది. చక్కనిశయ్యా ధారాశుద్ధిగల కవిత్వం. అతి సరసంగా వున్నది.

39. **హితోపదేశామృతం** - 500 గాథావృత్తాలతో 5 కథాభాగాలుగా వ్రాయబడినది. అచ్చుకాలేదు. కాని చక్కని రచనగల గద్యపద్యమయమైన ప్రాకృత కథా గ్రంథం.

చివఱ:-

సిరిఅభయదేవముణివయి విణేయ సిరిదేవభద్దసూరీణం,
అనివుణమయీాహిం సీసేహిం సిరిపరమాణంద సూరీహిం.
గాహాణం సంఖాయే పంచసయా పంచవీసహియా,

ఆరభం:-

నమియ సురాసురసిరల్హ సిరసరసమందారకుసుమరేణూహిం,
నిమ్మజ్జియపయహదప్పణే పణమిమో సిరసా.

40. **సేతుబంధకావ్యం**- ప్రవరసేనుడిది. దండిపండితుడని కీర్తిగన్న దండి పండితుడి ప్రశంసగన్న కావ్యం ఇది. ఉత్తమప్రాకృతమయిన మహారాష్ట్రి ప్రాకృతంలో వ్రాయబడ్డది. గ్రంథం అచ్చై సులభసాధ్యంగా వున్నందున ఒకటిరెండు శ్లోకాలే ఉదాహరిస్తాను. జగమెరిగిన బ్రాహ్మడికి జందెం ఎందుకూ? 15 ఆశ్వాసాలగ్రంథం, కాస్తాకూస్తా కాదు. కావ్యమాలలో ప్రకటితమైంది ఈ గ్రంథానికి కవిపెట్టిన అసలుపేరు రావణవహా మని. అయినా సేతుబంధమనే లోకంలో విఖ్యాతి పొందివున్నది.

శ్లో. ణమహ అవడ్ఢియతుంగం అవసారియవిత్థయం అణోణయగహిం,
అప్పలహుయ వరిసంగం అణాయపరమత్థపాఉడం మహతుడణం.

దణుయేంచరుహిరలగ్గే జస్స పురం తేణాపుహోవిచ్ఛడ్డే గుప్పం,
తీవివలాయా గలియవ్వధణంసుయే మహాసురలచ్ఛి.

....అహిణవరాయారద్ధా చుక్కక్ఖలియేషు విహతియపరిత్థవియా,
మేత్తివ్వ పముహరసియా ణివ్వోఢుం హోయి దుక్ఖరం కవ్వకహా.

....తం తిదసబందిమోక్ఖం సమిత్థత్తేల్లోక్కహియయసల్లుద్ధరణం,
సణయి అణురాయఇణ్హాం సీయా దుక్ఖఖ్ఖయం దహముహస్సవహం.

గమియా కలంబవాయా దిత్థం మేహం ధయారియం గయణయలం,
సహియోగజ్జియసద్దో తహ వి హుసేత్థి జివియా ఆసంగో.

....దిత్థత్తి ణ సద్దహియం సచాహమంధరం ణీససియం,
సోయయితుమంతిరుణ్ణంపహుణాజీయయిత్తి మారుయీఉవహూఢో.

## కవిరాజు—ప్రాకృతాదికవుల స్థానం

ఈల్లా వుదాహరించడంసాగిస్తే అంతుముట్టడంకష్టం, కాబట్టి ఈ విషయం ఇంక కొంచెం కట్టిపెడతాను. ఇంతవఱకూ ప్రాకృతం అంటే నాటివ్యవహారికమైన శిష్టభాషే అనీ, అది తొల్తటిరోజుల్లో లాక్షణికులూ ఆచారపరులూ మున్నగువారిచేత తిరస్కరింపబడ్డా, ఆ తర్వాత శిష్టులూ ప్రమాణభూతులూ అయిన పండితులూ కవులూ గ్రంథకర్తలూ దార్శనికులూ కథకులూ ఆ భాషలోనే గ్రంథాలు వ్రాసీ, లక్షణాలు అలంకారశాస్త్రాలు ఏర్పరచీ వుండడంచేతనున్నూ, మతప్రచారకులునూ మతకర్తలున్నూ దానికి అగ్రస్థానం ఇచ్చి ప్రోత్సాహం చూపడం చేతనున్నూ, ఆ ప్రాకృతానికి గ్రంథప్రయోగార్హతా గ్రంథసమృద్ధీ లక్ష్యలక్షణసంపదా ఇత్యాదులన్నీ యేర్పడ్డవి. కేవలం ఇంతమాత్రమే గాక కవిరాజులు రాజులూ తమతమ సారస్వతసభల్లో దానికి ఒక ప్రత్యేకమైన స్థానమున్నూ ఆ భాషలో కవితచెప్పేవారికి సంస్కృతికులతోపాటుగా సమానాలయిన గౌరవ

ప్రపత్తులూ కలిగించి పెంచి పోషించారు. ఇది రాజశేఖరకవిరాజు మాటలనుబట్టి విశదమవుతుంది. రాజశేఖరమహాకవి రాజకవి. రాజసభలను వర్ణించే ప్రస్తావనలో 10వ అధ్యాయంలో అంటున్నాడు వినండి -

పూర్వేణ ప్రాకృతాః కవయః, తతఃపరం నట నర్తక గాయన వాదన వాదక వాగ్జీవన కుశీలవ తాలవచారః, అన్యేపి తథావిధాః, పశ్చిమేనాఽపభ్రంశినః కవయః, తతః పరం చిత్రలేప్యకృతో మాణిక్య బంధకాః....దక్షిణతో భూతభాషాకవయః....ఉత్తరత స్సంస్కృతాః కవయః నివేశేరన్. (రాజశేఖర కావ్యమీమాంస 10. పే 54 - 55)

ఇల్లా అనడమే కాకుండా, ఆ మహారాజే ఆయాదేశాలలో ప్రాకృతభాషల యుచ్చారణసౌష్ఠవము చెడకుండా వాడుకలోనుంచికొని పోషించినమహారాజులను కూడా కొందరిని వుదాహరిస్తూవున్నాడు చిత్తగించండి -

1) శ్రూయతే హి మగధేషు శిశునాగోనామ రాజా. తేన దురుచ్చారా నష్టౌ వర్ణా నపాస్య స్వాంతఃపుర ఏవ ప్రవర్తితో నియమః. టగారాదయ శ్చత్వారో మూర్ధన్యాః తృతీయవర్జ మూష్మాణః త్రయః క్షుగార శ్చేతి. 2) శ్రూయతే చ శూరసేనేషు కువిందో నామ రాజా తేన పరుష సంయోగాక్షరవర్జ మంతఃపుర ఏవ ప్రవర్తితో నియమః 3) శ్రూయతే చ కుంతలేషు సాతవాహనోనామ రాజా. తేన ప్రాకృతభాషాత్మక మంతఃపుర ఏవేతి సమానం పూర్వేణ. 4) శ్రూయతే చ — ఉజ్జయిన్యాం సాహసాంకోనామ రాజా, తేన చ సంస్కృత భాషాత్మకం అంతఃపుర ఏవేతి సమానం పూర్వేణ.

ఈ వాక్యాలనుబట్టి రానురాను ప్రాకృతభాషలు తొలుత తెగడబడ్డవే అయినా, తర్వాత ఎల్లా పొగడబడ్డవో, శిశునాగ కువింద కుంతల సాతవాహనాది రాజులు ఆ భాషల కెంతటి ఉన్నతిని ఇచ్చారో. పండితులూ కవులూ శాస్త్రవేత్తలూ నిరంతరమూ ఏరీతి శ్రమించి, గ్రంథాలు వ్రాసి ప్రబోధం కల్గించారో, స్పష్టము అవుతూనే వుందికద. కనుక ఈ చెప్పిన - లేక - వ్రాసినగ్రంథసందర్భం ప్రాకృత గ్రంథకర్తలూ - వారిప్రజాసేవా - అనే విషయాన్ని నిరూపించడమునకు పర్యాప్త

మనే తలుస్తున్నాను. ఇందులో స్థలసంకోచంచేతా, నా తెలివితక్కువచేతా నేను పేర్కొనని గ్రంథాలు వందలూ వేలూ ఉన్నవని చదువరులు జ్ఞప్తిఉంచుకో ప్రార్థితులు.

## అంతవృద్ధి పొందిన ప్రాకృతభాషలు నేడు ఏమైనవి ?

ఇక ఈ విషయం ముగిస్తున్నాను. ప్రకృతం ఇక్కడ శేషించిన రెండు మూడు విషయాలు చెప్పవలసి వున్నది. కొందరికి ప్రాకృతం నిజంగా ఇంత యభివృద్ధి పెరిగివుంటే - మఱి ఆ వాఙ్మయం ఏదీ ? - అనే ప్రశ్న కలగడం సహజం. కాబట్టే అల్లా చాలామంది ప్రశ్నిస్తూ వుంటారు కూడాను. వారికి నాది ఒక్కటే మనవి. వాఙ్మయం నాటిది నేడూ వున్నది. ఇక లేనిదేమంటే ఇప్పుడు ప్రాకృతం మఱి ప్రచారంలో లేకపోవడమే. ఈ దోషం సంస్కృతానికి కూడా నేడు వుండనే వున్నది. ఆనాటి ప్రాకృతం నేడు వివిధములయిన దేశభాషల క్రింద మారి వృద్ధిపొంది గుర్తింపలేనంతటి విభిన్నతను పొందింది, విభక్తులయి దేశదేశాలకు చెదరిపోయిన సోదరకుటుంబాలలాగానే. ప్రత్యేకించి దేశభాషా రూపులతో వికాసం పొందడం ఆరంభం గావడంతోటే ఆ తొల్లటి గ్రాంథికభాషా - వ్యావహారిక భాషా (అంటే ప్రాకృతం) అల్లాగే స్తంభించిపోయినవి. అంటే వున్నంతవఱకూ ఆనాటిగ్రంథరూపం గానే నాటిసంస్కృతప్రాకృతాలు స్తంభించిపోయినవి. దేశభాషలు దేశకాలపరిస్థితుల ననుసరించి పెఱుగుతున్నవి. పెఱిగినవి. ఇంకా పెఱుగుతవి కూడా. ఇదే కారణం అంటాను.

వివరింపవలసిన ప్రధానవిషయం వివరించాను. ఉపాదేయంగా వుంటే గ్రహించండి. అనుపాదేయమైయితే త్రోసిపుచ్చండి. నాకు పట్టుదల లేదు. సిగ్గూ అభిమానం అంతకన్నా లేదు తెలిసింది కొంచెం. తెలియవలసింది హెచ్చు. నాకు గల ప్రాయంలోనూ ప్రాజ్ఞతలోనూ వుపయోగించనిది హెచ్చు, లోకానికి వుపయోగించేది తక్కువ. అయినా ఏదో గోల పెడుతూనే వుంటాను. అది నాస్వభావమైనట్లే ఇష్టం లేకుంటే వినకండావుండటం మీకున్నూ.

## ఆంధ్రులు - అందులో నేటిపండితులూ ప్రాకృతపరిశ్రమం చెయ్యవలసిన ఆవశ్యకం చాలా విస్తారంగా వుంది ;

నేడు ఆయుష్మంతులై ఆదర్శమణులై వున్న ఆంధ్రదేశపు గ్రాంథిక

వాదులపైని నేను చాలా గౌరవాదరాలు చూపేవాడనే. తిరుపతి వేంకటేశ్వర కవులు, వేంకటరాయశాస్త్రిలు, మండపాక పార్వతీశ్వరులు, కవిరాజులు, (సారస్వతంలో గాకున్నా సంపదలోనేనా) గొప్పవారుగావుండే జయంతివారూ, త్రిపురానదొరలు ఆచంటలు జనమంచిపీఠాలు ఈ మొదలయిన వారందరికీ ప్రాత స్స్మరణలు సమర్పిస్తూనే వుంటాను. కాలం మారినది. ప్రవృత్తులూ అభిరుచులూ మారినవి. సారస్వత క్షేత్రం విస్తరించింది. ప్రాతవి కల్పవృక్షాలుగాకున్నా కల కాలం వుపయోగించే సంజీవనీమహౌషధులే. కాని కొత్తమొక్కలు నాటేకాలం సమీపించింది. యువకవర్గంవారిది నేటికాలం రాబోయే కాలం కూడా. వారు వెనుకటివారికి కృతజ్ఞత చూపుతూ వారివ్యవహారాన్ని మఱవకండా జ్ఞాపకంవుంచు కొని, ముందుకాగలవారికి మార్గదర్శకులు కావాలని నా కోరిక. (బాష కట్టుదిట్టం చెడవలెనని నేను అనను. శిష్టవ్యవహారం గ్రంథస్థంగా అంగీకరిస్తే చాలు.) వివిధ దేశాలవారూ తమతమ సారస్వతోద్యానాలు బాగుచేసికొంటున్నారు. ఆంధ్రుల్లో అట్టిప్రయత్నం జరగాలి. కొంత ఆరంభమైంది కూడా. నేటిపండితులు శక్తి గలవారు కొందరేనా ప్రాకృతాలలో పరిశ్రమించవలె నని ప్రార్థన. ప్రాకృత వాఙ్మయ పరిశ్రమచేయగలపండితులు - అయిదు ఆరుగురుకంటే లేరు. శ్రీ రాళ్ళ పల్లి అనంతకృష్ణ శర్మ, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, చిలుకూరి నారాయణరావు, మానేపల్లి రామచంద్రశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం, మేడేపల్లి వెంకటరమణాచార్యులు ఇత్యాదులు కొంద రున్నారు. ఈ సంఖ్య చాలదూ. నేడు వాఙ్మయవిమర్శనంకోసం పరిశ్రమించే వారూ, చరిత్రకోసం వెదకేవారూ కూడా ప్రాకృతం గాలించాలి. ఎన్నో దేశ్యాలు ఎన్నో కల్పనలు ఎన్నెన్నో వాక్చమత్కారాలు, సరసపణితులు, ఎన్నో చరి త్రాంశాలు - ప్రాకృతం ఇస్తుంది. తక్కినవాటిని వదలుకొనవలెనని నా మనవి కాదు. దీన్నిన్నీ ప్రధానంగా ఎంచండి-అనే.

## ఉపసంహారం - నేటివ్యావహారికభాషా - గ్రాంథికభాషావాదుల కొకమనవి.

ప్రాకృతాన్ని గురించే ఈవ్యాసంలో వ్రాయవలసివున్నా, సాదృశ్య సాన్ని హిత్య సంబంధాలనుబట్టి నేటి గ్రాంథికవ్యావహారికవాదాన్నికూడా, అద్యంతాలూ జతచేశాను. పుత్తికొక బుద్ధి. ఇది నా బుద్ధి. క్షమించి ఈ ప్రార్థన చిత్తగించండి.

భాషమారగూడదూ నన్నయతిక్కన్నలనాటిరూపమే వుండాలి అనడం భాషాభి వృద్ధికి సాధనం కాదని మనవి. కనుక నేడు శిష్టులని వ్యవహరించే ప్రామాణి కుల ప్రయోగాలకూ వ్యవహారానికిన్నీ తాము అనుశాసనం ఇస్తే చాలు. వ్యావ హారికవాదులు తృప్తి పొందుతారు. కాదని తెగిందాకా బిగదీయడం గ్రాంథికము నకు గూడా ముప్పే. ఇది గ్రాంథికవాదులకు మనవి. అష్టదిగ్బంధాలూ చేయడం తన్మూలాన - అలో అనిపించడం ఎంత తప్పో, వ్యావహారికంలోనైనా న్యాయము లగు నీతినియమాలకు బద్ధులై సంచరించడమూ గ్రంథాలు వ్రాయడమున్నూ లేకుండా ఉత్పథవిహారం చెయ్యడం కూడా అంతే తప్పు. నేడు కొందరుకొందరు నవసంప్రదాయంవారి గ్రంథాలల్లో వ్రాతల్లో కూడా ఈ నవ హెచ్చుతూంది. విశృంఖలత్వం అనేది స్వాత్మపతనానికి కారణం. కాబట్టి లోకవ్యత్యయం కలగ కుండా ఆవశ్యకములయిన కట్టుబాట్లను చేసికొని నడవడం వ్యావహారిక భాషా సంప్రదాయంవారికి ముఖ్యకర్తవ్య మని సవినయంగా మనవిచేస్తున్నాను.

వ్యావహారిక భాషావాదపు అర్హతా ప్రామాణ్యం స్థాపించడం అయిపోయింది. ఇప్పుడందులో అభివృద్ధి గ్రంథరచనా ధారళంగా ఏర్పడాలె. అందుకై శ్రీ రామ మూర్తి పంతులుగారూ వారి యనుయాయివర్గం కృషిచేసీ రస్తాలూ రోడ్లూ మేడలూ మిద్దెలూ తోటలూ దొడ్లూ తీర్చి పామరజనాలను అనుగ్రహించాలని ప్రార్థన. ఈప్రార్థనతోనే న్యాయములూ ధర్మ్యములూ అయినకోర్కెలు కొనసాగించే దేవికి అనంతంగా నమోవాకాలు సమర్పించుకుంటాను. శ్రీరామమూర్తి పంతులుగారు - శేషించిన వారిజీవితంలో వ్యావహారికభాషాకల్పవృక్షపు దివ్యపరిమళములను తనివి దీర గ్రోలగలుగునట్లు భగవాను డనుగ్రహించుగాక, స్వస్తి.